శ్రీ

# మాతృప్రేమ




52

276

ఇది

పామర్తి బుచ్చిరాజుచే

విరచింపఁబడి

ప్రచురింపఁబడియె.

మొదటికూర్పు

రాజమహేంద్రవరము

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

SL NO. 861

Acc NO. 7475

1914

వెల రు 0—1—6.

మా తెనక్కీర్తనలు గలనాటకములు.

శ్రీసంగీతపద్మిని:—నవీనపద్ధతుల ననుసరించి వ్రాసినదైయొదంక ములనాటకము. వీరరసప్రధానము. కథ రాజపుత్రరాణియు సౌందర్యవతియు నగు "పద్మినీ" దేవిని దుర్మార్గచక్రవర్తి యగు "అల్లాయొదీన్" పడయఁ గోరి చిత్తూరు ముట్టడించుట. ఇది దేశభక్తిని, రాజభక్తిని, శౌర్యధైర్యములను, పాతివ్రత్యమును బత్నీవ్రతమును, ముసలమానులదుష్ప్రవర్తనలను మిక్కిలిచక్కఁగఁ దెలిపెడిని. ప్రదర్శనానుకూలము. వేమనూరవేంకటపతిపద్యములఁ బోలుపద్యములు త్వరలో వెలువడును. -8-అణాలు

క. కలనా! యేమిది! హా! యీ

కల నా కేటికిఁ గలిగెను గాళీ! భవానీ!

కలనా తాళఁగ నూనుల

కలనాదము వినక యెక్కడియు యయిన నే.

శా. బాలుం డయ్యు ధనుస్సు కేలఁ గొని యూపార్థాత్మజుం డద్దిరా!

యాలంబందున ద్రోణకర్ణకృపశల్యాదిప్రసిద్ధుల్ నడం

కల్ లజ్జం బడి వెన్ను చూపునటులుం గారించి పెంగీర్తిఁ దా

నీలోకంబున వీడి వీడఁ డనువే యే సల్పె వర్తించెదన్.

శా. పాతివ్రత్యము పూని నేను ధరణిన్ వర్తించిన ట్లైనఁ బ్రఖ్యాతిన్ నాపతి కాంచిన ట్లయిన నీ కామాంధముం డంతముం

దాతంకార్తుఁడు రోగపూరితుఁడుఁ బ్రత్యాఖ్యాతుఁడున్ భీరువున్

వీతోత్సాహుఁడుఁగాపుతన్ సతులతోఁ బెన్ వైరమున్ బొందుతన్.




276

ఇది

మదీయమాతామహులు స్వర్గీయులగు

నెపం దలంపోసి వానినామమే

ఈ యానందనామసంవత్సరభాద్రపదశుద్ధ

పంచమీబుధవారమురాత్రి జననము

గాంచిన నాపుత్రునందును కషి

పోతంపు శ్రీరామునియొక్క కరుణాకటాక్షమున

వృద్ధి నొంద డెందమునం దలంచి యానంద

మానసుండనై యామందహాససుందర

వదనారవిందునిపాదారవింద

ములకు వందన

పూర్వకంబుగ

సమర్పించితి.



# భూమిక

సదయహృదయులారా!

తల్లిదయఁ దలఁపోయ నాతరము కాదు కదా నన్ను బుట్టించిన బ్రహ్మకైనఁ దరము కాదు. కన్నతండ్రికన్నఁ గన్నతల్లి యుండుట మేలు; తల్లి లేకున్నఁ దరమే లే దన్న పెద్దలపలుకులు ముమ్మాటికిని సత్యము సత్యము సత్యము. తల్లిదండ్రులు గతించినవారిసంగతి మఱి వేరె చెప్పవలయునా? ఒక్కరేయి ప్రసవవేదనం బడు చున్నయిల్లాలి కేకలు చెవి సోకనీపద్యములు వ్రాయుతలం పంకురించె. అంత మఱునాఁడే యివి ముగించితి. మనీషులు నాదోషములు మన్నించి సుగుణంబులనే గొనెదరు గాక!

ఇట్లు,

విబుధజనవిధేయుఁడు,

పామర్తి బుచ్చిరాజు.

శ్రీ

శ్రీకృష్ణార్పణమస్తు.

# మాతృప్రేమ.

సీ. శ్రీ లెన్నియున్నను బాలబాలికలకై పరితపించుచు నుండు భావమునను
కొడుకు లేనిల్లు హంసుఁడు లేనిజగ మని పరితపించుచు నుండు భావమునను
సుతులు గలుగ కున్న గతి సున్న యనుకొని పరితపించుచు నుండు భావమునను
సూనులఁ గన కున్న మాతృక్కు లే లోకో యని పరితపించుచు నుండు భావమునను
తే॥గీ. బిడ్డమాటలను విననివీనులు నీక
బాలుఁ గౌఁగిలింపనిచేతు లే లొక్కో యని
పరితపించుచు నుండును భావమునను
మాతను సమాన మెవ్వరు మహి నయారె!

సీ. నోము లెన్నియొ నోచి రాములఁ బిలిపించి ఫలము లొసంగి దీవనలు దాల్చి
సోదికత్తెలఁ బిల్చి సోదెల నడిగించి యాశావికాసము లమరఁ దాల్చి
యోలుకుల రప్పించి గురుదక్షిణ లొసంగి వేరుముక్కలు మెడఁ బేర్మి దాల్చి
సన్యాసులను బిల్చి సర్వంబు నెఱిఁగించి వా రిచ్చుబూది మైఁ బరఁగఁ దాల్చి
తే॥గీ. క్రమముగా భూరియగ్నిహోత్రములు వేల్చి
తనగురు వొసఁగుసేస లౌఁదలను దాల్చి
పసపుకుంకుమతో లక్ష్మినాలెను బోల్చి
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

సీ. జపతపంబులు సేసి యుపవాసములు సేసి జాగరములు సేసి జడుపు త్రోసి
గాలివానల నుండి కటికిరాళ్లను బండి యిలను బాదము మండ నెండ నెండి
తీర్థయాత్రలు చేసి దేవళంబులు డాసి పూలు పత్రియుఁ గోసి పూజ చేసి
ముడుపులాగులు పెట్టి ముడుపు లెన్నియొ కట్టి నెడఁదఁ జిక్కఁ బట్టి నడుము కట్టి

తే॥గీ. గట్టిగా నేల మృదుదేహ మిట్టె పెట్టి
విపులసాష్టాంగవినతులు వేడ్కఁ బెట్టి
పట్టి దయసేయుమని గట్టిపట్టు పట్టు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె !

సీ. కల గంటి నమ్మరో ! కల గంటి రాత్రి నేఁ గమలాయతాక్షుఁడు కడకు వచ్చి
మెచ్చితి నమ్మ ! నీసచ్చరిత్రమునకు నిచ్చితి సంతాన మిచ్ఛతోడఁ
గొన్నాళ్లలోనె నీకోర్కి ఫలించెడి నని తెల్పి యేగిన ట్లబలలార !
దీనిఫలం బేమొ తెల్పరే యని యాత్రమున వేఁడునప్పుడు ముగుద లెల్ల

తే॥గీ. సన్నుతచరిత్రి ! హరియె ప్రసన్నుఁ డయ్యె
నింక నీమనోఫలసిద్ధి యేల కల్గ
దన్నమాత్రన నుప్పొంగి మిన్ను ముట్టు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె !

సీ. రెండవమాసంబు నుండి యైదవ నెల వెళ్లెడునంతకు వేవిళ్లతోడ
వేవిళ్లు కలకాల మాసంతయన్నంబు నైనను దిన నీనియరుచితోడ
నరుచికి సాయమై యాఱవనెలలో నుదరమున నొదవుకదలికతోడఁ
గదలిక కంటె యై కడుపున నుదయించి తిరముగా నుండనిత్రిప్పుతోడ

తే॥గీ. నిట్టియిడుములతోడనే యెప్పుడుఁ గూడ
వేఁగు చుండి తనకు మగబిడ్డ పుట్టు
ననినయంతన పరవశ యగుచు నుండు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె !

సీ. నిలువఁ గూర్చుండఁగా నిల్వఁడఁ గన నీక కష్టమ్ము లొడఁగూర్చుకడుపుతోడ
నభిమాన మగునగ లమరించుకొన నైన భాగంబు లేక విరక్తితోడ
దాఁ గోరుచీరను దా ధరింపఁగ లేక కట్టిన తెలికబట్టతోడఁ
దనయాడువారితోడను వేడ్క లరయంగ నరుగంగ లేనిప్రయాసతోడ

తే॥గీ. సతము వేఁగియు దైవప్రసాదమునను
దనకుఁ గొడుకు కలుగు నని తరుణు లనినఁ
బొంగి యంతరంగము పొంగి నింగి ముట్టు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె !

సీ. ప్రసవసమయమునఁ బహుబాధ లైనను మాటపలుక కైన మఱచె నను పక
హా! దైవమా! యని వేదనన్ బొంది కుమారుఁ గన్నవిధంబు మఱచి నను పక
మూన్నాళ్ళపఱి కన్నమును బెట్టకుండిన నది యిసుమంతయు మది నను పక
స్నాన పానావళికిఁ దన్ మానవు లేరును గదయు కున్న నదియు మఱచె నను పక
తే॥గీ. వేగ ముక్కిరిబిక్కిరి గాఁగ నీళ్లు
మసనతులు పోసినవిధంబు మఱచె నను పక
కొడుకు నొడిలోన నిడుకొని కులుకు చుండు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!
సీ. బోయకాడింమనో బోయబోయన నేడ్చుకన్నకొడుకుపను గాంచి కలఁగుఁడు వడి
చాలుఁ జాలును దల్లి! చాలు నే నీళ్లని యావేళ కాళ్ళ్రుత్వ నూఁపివైచి
బోయ కాడినబిడ్డఁ బొత్తుల నిడుకొని తడి నొత్తి క్రిమసంగఁ బలను దుడిచి
సాంబ్రాణిఁ బొగ నైచి చక్కఁ గుంపటి సెగ మంచముక్రింద నమర్చి పెన్ప
తే॥గీ. గాలి ధూళి పిశాచములు వారిల కుండ
నులికిపడ కుండఁ దనహస్త ముంచి గుండెఁ
గంటికిని రెప్ప వోలెను గాచు చుండు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!
సీ. ఇనుమంత నిసు వేడ్వ నిల్లు పైఁ బడునప్డు శిరముపై నాకాశ మొరగునప్డు
బిఱుగు మొత్తునపుడుఁ గడలి పొంగునపుడు నగ్నిహోత్రుఁడు చుట్టు నలమునప్డు
వాద్య్రశ్చికంబుగ నాపద గన్నప్డు దుఃఖవార్తలు చెవి మూరునప్డు
దొంగ లిల్లును జొచ్చి దోఁచుచు నున్నప్డు విషజీవములు వెఱపించునప్డు
తే॥గీ. నైనఁ బొందనియాందోళ మప్డు పొంది
యయ్యొ! నాయయ్య! నాతండ్రి! యయ్యొ! నేను
దచ్చిపో రాలి పో నని సరగ నరుగు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!
సీ. నాతండ్రి! నాయయ్య! నాబాబు! నాయప్ప! నాయబ్బ! నాయబ్బి! నాకుమార!
నాచిట్టి! నాపొట్టి! నాపట్టి! నాపిన్న! నాపొన్న! నాగున్న! నాకుమార!
నాబాల! నాపాప! నాకుఱ్ఱ! నాకూన! నానీడ! నాతోడ! నాకుమార!
నాశుక్తి! నాశక్తి! నారక్తి! నాస్యక్తి! నాభక్తి! నాముక్తి! నాకుమార!

# మాతృప్రేమ.

తే॥గీ. కాకి! రావే యటంచును వాకసమునఁ
జందమామఁ జూపించుచు సందు గాంచి
బువ్వ దినిపించి మోదించు నెవ్వ రట్టి
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

సీ. అఁ—హోఁ— యటంచును నటు నిటుఁ బకుచును గాలి త్రోలుచు జేకఁ గాంచునపుడు
చక్కఁగాఁ జేర్చిన కాంత్రి పట్టుచు ముసి ముసినగవు పలికి పొల్చునపుడు
తత్త తాత యటంచుఁ గ్రొత్తపల్కులఁ బల్కి కాలు సే యాడించి క్రాలునపుడుఁ
జెంత కేగినయంతఁ జేతు లల్లనఁ జాచి రమ్మెత్తుకొమ్మని సౌంజ్ఞ యిచ్చునపుడు
తే॥గీ. ఎనుథఁ గూర్చుండునపుడును బ్రాకునపుడు
నిలచి నపుడు నడుగు లిడఁ దలఁచినపుడు
మోద మొందిం సతము నవ్వుమొగము పెట్టు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

సీ. ఊఁగుటూయ్యాలలో నుంచి జోకొట్టుచు నూఁపి పాటలు పాడు చుండునట్టి
దూఁబూచు లాడుచుఁ దోశంబు నవ్వించి మోదర పైకెత్తి మురుఁగునట్టి
చుంచు దువ్వి జడలఁ జుట్టి పువ్వులు బెట్టి తొడవు లిడి ముదంబు దొడరునట్టి
కాళ్లగజ్జెలు గల్లు గల్లు మనఁగ వచ్చునట్టి నెత్తుచు ముద్దు పెట్టునట్టి
తే॥గీ. యక్క యన్నని తెల్పుచు నలరునట్టి
ముచ్చటాడుచు లోలోన మురియునట్టి
నాఁథునకు జొప్పఁ జెప్పుచు నవ్వునట్టి
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

సీ. ఆఁకలి యగు చున్న నన్నము తిను చున్నఁ బని సేయు చున్నను బాడు చున్నఁ
బన్నగతల్పుని బ్రార్థించు చున్నను బతితోడ నున్నను రతుల నున్నఁ
దోడివారలఁ గూడి వేడుక పడు చున్న నీర మాడుచు నున్న నిద్ర నున్న
సిగఁ జుట్టుకొను చున్నఁ జీరఁ గట్టుచు నున్న నగలు పెట్టుచు నున్న నడచుచున్న
తే॥గీ. నిన్న యన్నియు నన నేల యెన్న రాని
బన్నముల నున్న గోడు కేడ్చు చున్న విన్నఁ
దన్నిమాషమునఁ బఱు గిడి చన్నొసంగు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

సీ. తల దువ్వి మేలివల్వలు గట్టఁగా నిచ్చి పాఠశాలకుఁ ద్వరఁ బంపు నెవరు
బడి కేగి వచ్చెడిబుడుతకు మువ్పొద్దు వేళకు నన్నంబు వెట్టు నెవరు
తడసిన నొకయెడఁ దనయుఁ డింకను రాఁడు గా యని మోదముఁ బాయు నెవరు
నిలయమునకు వచ్చి నిలిచినకొమరుని వే ముద్దు గొని చంకఁ బెట్టు నెవరు
తే॥గీ. పెన్నిధిని గన్న పేద నాఁ బేర్చు నెవరు
తాయ మిడి సంతు మోదింపఁ జేయు నెవరు
పవ్వళింపఁ బ్రక్కను వేయు నెవ్వ రట్టి
మాతకు సమాన మెవ్వారు మహి నయారె !

సీ. అమ్మ యాతఁడు విద్య నసమానుఁ డన్నచో నానందమునఁ దేలి యాడు చుండు
సమశరనిభుఁ డగుసుతుని గన్నులఁ గని యానందమునఁ దేలి యాడు చుండుఁ
బెండ్లిపీటను గలబిడ్డని గనుఁగొని యానందమునఁ దేలి యాడు చుండు
కోడలఁ గని సొంతకూఁతుఁ గాఁ దలఁపోసి యానందమునఁ దేలి యాడు చుండు
తే॥ గీ. నందనునినందను గని యానందపడుచు
నొడిని నిడుకొని ముద్దుల నొనరఁ దెలిపి
యమితమోదవార్ధిని దేలి యాడు చుండు
మాతకు సమాన మెవ్వారు మహి నయారె!

సీ. తెల వార కుండఁ బ్రతిదినము వేళకు ముగ్గును బోసి పా లొసఁగుదాది!
మలమూత్రముల నున్న తెలిబట్ట లెల్లను నుతికి శుభ్రము చేసి యుంచుదాసి!
యారోగ్యము చెడినయావేళ మందులు వేసి రక్షించెడివెజ్జురాలు!
సర్వదా సర్వథా సర్వత్రయును దోడు నీడ యై మెలఁగెడి నేస్తురాలు!
తే॥ గీ. సర్వగుణములను బల్కుశాస్త్రవేత్త!
మహివిచిత్రములను దెల్పుమంత్రవేత్త!
నిఖిలధర్మశాస్త్రములను నేర్పుగురుణి!
మాతకు సమాన మెవ్వారు మహి నయారె!

సీ. కొట్టిన నయినను దిట్టిన నయినను గోపింప నేరనిగురుసుశీల!
పోషింపు చుండినఁ బోషింప కుండిన గుట్టు వెలికిఁ దేనిగుణధురీణ!
మూర్ఖుఁ డయినను ముక్కోపి యైనను సతతము ప్రేమించుసదయహృదయ!
ధనవంతుఁ డైనను దౌర్భాగ్యుఁ డైనను నిముస మెడఁ బాయనినిర్మలాత్మ!

తే॥ గీ. ఘాతలను బూన నేరనిపూతచరిత!

మంచిమాటలు వచియించుమంజువాణి!

యభ్యుదయము నే యాశించు నార్యసద్వ్రతి!

మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

సీ. అజ్ఞాన మనియెడు నంధకారముఁ బాపి సుజ్ఞాన తేజంబు చూపుతరణి!

సంసారసాగరసకలకష్టంబుల ముంచి వేయక తేల్చి యుంచుతరణి!

ఇష్టఫలంబుల నిచ్చుచు దారిద్ర్యకష్టంబు లేడఁ బాపుకల్పతరువు!

భక్తియోగము తెల్పి ముక్తినగరమును డాయఁగా నడుపు కడాని తెరువు!

తే॥ గీ. ధైర్య మొసఁగ నెలకొలిపెడు ధైర్యలక్ష్మి!

సకలసంపద లొసఁగఁ గూర్చుసహజలక్ష్మి!

మానసోల్లాసమును జేయు గానలక్ష్మి!

మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

గద్యము :— ఇది శ్రీమత్సహస్రసహస్రపత్రమిత్రప్రభాభాసమాన శ్రీ [illegible]ము కరుణాకటాక్షవీక్షణసాహాయ్యలబ్ధకవితాధారేయ సుకవివిధేయ పైడిపాలగోత్రోద్భవ పామర్త్యస్వయాబ్ధిప్రదీపాబ్ధినవనీత వీర స్వామ్యాఖ్యతనూభవ గంగమాంబాగర్భశుక్తిముక్తాఫల బుచ్చిరాజప్రణీతంబైన శ్రీమాతృప్రేమనామపుస్తకంబున సర్వము సమాప్తము.



# విక్రయమునకు సిద్ధముగ నున్న గ్రంథములు.

శ్రీసంగీతజగన్మోహినీనాటకము—ఇది యొకపతివ్రతాశిరోమణిచరిత్రము పద్దెములు ముద్దు లొలుకు చుండును. కథాసందర్భ మత్యద్భుతము. వెల 0—12—0 లు మాత్రమే.

ఉ. మానమె కల్పభూరుహము మానమె నాకఁ బెన్నిధానముల్
మానమె తోషసీమయును మానమె రత్నసువర్ణభూషలుల్
మానమె నిత్యయౌవనశ్రీయు మానమె యాపద నోర్చుదిట్టయుల్
మానమె మోక్షదాయకము మానమె సర్వము మానినీమణీ!

సీ. మనబాధలను గాంచి మనముస నెనరుంచి
యనలరశ్ములు మాపెఁ గినిసి కినిసి
కార్యంబు గానమిఁ గటకటం బడ మొగ
మెఱ్ఱనై పర్యంత మేడ్చి యేడ్చి
ఛాయపుంజపుబంట్లు జాబిల్లికడకు నే
మనవార్త లెఱిఁగింపఁ బనిచి పనిచి
పక్షులు నాదిగాఁ బని మాన్పి కూండ్లకుఁ
గోలాహలం బెచ్చఁ దోలి తోలి

గీ. కమలములమోదమును నీటఁ గల్పి కల్పి
చీఁకటిని లోకమున వ్యాప్తి చేసి చేసి
సుజనులయెదను దుఃఖంబు చొన్పి చొన్పి
లోకబాంధవుఁ డేగెను లోగి లోగి.

శ్రీసంగీతకృష్ణనిర్యాణము—ఈనాటికయందలికథ “యాదవకులమునకు ముసలము” అను భారతభాగవతకథయే. కరుణారసప్రధానము. కన్నీ రొలికించును. వెల 0—8—0 లు.

మ. నిజభక్తుల్ భవదీయదాసు లికనుత్కీర్ణ నిపుణ మహాంధ్రుల్ సఖుల్
సుజనామోదగుణానువర్తులు లసత్స్వామ్యాంశసంభూతులో
గజరాట్ఖేదవిదారణా! సురవరా! గంగాత్రినూజసుతా!
త్రిజగన్మోహనమూర్తి! వైరిసమువర్తీ! మమ్ముఁ గాంపోఁ గదే!

మాతృప్రేమ—ఇది మాతలయనురాగమును బాగుగఁ దెలుపు సీసపద్యములు గలచిన్నపొత్తము. వెల 0—1—6.

సీ. ఆఁకలి యగు చున్న నన్నము తిను మన్నఁ బని సేయు మన్నను బాడు చున్నఁ
బన్నగతల్పుని బ్రార్థించు మన్నను ఉతితోఁ నున్నను రతుల నున్నఁ
దోడివారలఁ గూడి వేడుక పడు చున్న నిర మాడుచు నున్న నిద్ర నున్న
సిగఁ జుట్టుకొను చున్నఁ జీరఁ గట్టుచు నున్న నగలు పెట్టుచు నున్న నహముమున్న
తే॥గీ. నిన్న యున్నియు నన నేల యున్న రాని
బన్నముల నున్న గోడు కేడ్చు చున్న పిన్నఁ
దన్నముపమునఁ బట్టు గిడి చన్నొసంగు
మాతకు సమాన మెవ్వరు మహి నయారె!

స్వర్ణస్పర్శనము—“దురాశ దుఃఖమ్” అనువిషయ మయి చక్కఁగ బోధించు చిన్నవచనరచన. ముద్దులొలుకు చుండును. ఈకథ చదువ మొదలిడిన వినువ బుద్ధి పుట్టును. వెల 0—1—6 లు మాత్రమే!

1914 సం॥ లోగా శ్రీసంగీతజగన్మోహినీనాటకమును గాని శ్రీసంగీతకృష్ణనిర్యాణనాటికను గాని తెప్పించుకొనువారికి మాతృప్రేమ గాని స్వర్ణస్పర్శనము గాని యుచితము.

పామర్తి బుచ్చిరాజు,
పిన్నంగట్టువీధి, రాజమహేంద్రవరము.

